# జ్ఞాపకార్థము



కవి పౌత్రుడు

**I.S.R. శర్మ** A.M.C.N.K.

---

## మనవి

భక్తులారా !

నాన్న ప్రకటించినట్టి గ్రంథముల
కొన్నవి; వలయు భక్తులకోర్కెమీ
పూర్తిచేయనుంటి ద్వితీయముద్ర
ముందు పారాయణ చరిత్రపూర్తి

తలంచినట్టి కార్యములు విఘ్నవ
సమయమందు స్వామిచరిత పం
మండలమ్ము చేయ మహిమాన్వితమ్ముగ
సంకటములు దొలంగి స్వస్తికలుగు

పెదకొత్తపల్లి
26-07-2002

ఇట్లు
కుమారుడు
**రామబ్రహ్మం**

ఓమ్
శ్రీ మాతృపితృభ్యోనమః
శ్రీ మద్గురుదేవోభ్యోనమః



శ్రీరామబ్రహ్మ గ్రంథమాలా
ద్వితీయ కుసుమము

శ్రీరామ

# బ్రహ్మేంద్ర పారాయణ చరిత్రము.

సర్వాభీష్ట ఫలప్రదమగు గ్రంథము
పూజాసహితము

గ్రంథకర్త

బ్రహ్మేంద్ర భక్తి ప్రచారక

**ఇంకొల్లు శ్రీరామశర్మ** (శ్రీరామబ్రహ్మము)
శ్రీరామ బ్రహ్మాశ్రమము
పెదకొత్తపల్లి.

ద్వితీయ ముద్రణము - ప్రతులు 1000

1951

దీని వెల అమూల్యము

# కృతిసమర్పణము

నాచే భక్తి ప్రచారార్థము 1931 లో శ్రీరామ బ్రహ్మాశ్రమమును నెలకొల్పించి సేవాదర్పణము జేయించి 1932 లో బ్రథమదర్శనమిచ్చి నవీనముగావ్రాసిన "కోటి" ని గ్రహించి, 1933 లో యువజన మహాసభా యుక్తముగ తృతీయవార్షికోత్సవము నెగ్గించి 1935లో గురూపదేశమిప్పించి 1937లో "శ్రీరామా! నిను రంగనిదావుకు రమ్మంటిని" అను కాలజ్ఞానవాక్యమున కర్థముసూచించి, లక్షనామపూజనిర్వర్తించి 1939లో శతాహ్నిక సంకీర్తన మహాయజ్ఞమును గట్టున కెక్కించి 1941లో గోవిందాంబికా సిద్ధాంజనేయ జగదీశ్వరీ సహితముగ దమశిలావిగ్రహ ప్రతిష్ఠను బూర్తినొందించి, ఆసంవత్సరమే కందిమల్లయ్యపల్లెలో సన్నిధానమున నామైకాహమొనర్పించి, అందేముఖమంటపమున నాదొక యంకణముజేర్పించి, ఆచటనే శాశ్వతపూజల జరిగించు భాగ్యము బ్రసాదించి 1943లో 108 కళ్యాణములను శ్రీ విశ్వకర్మ మహాయాగమును నెరవేర్పించి, 1944లో గేయచరిత్రము జెప్పించి, 1945లోగ్రహణివ్యాధి సందర్భమున నాసన్నమృత్యువును దప్పించి 1946లో హరికథను, 1947లో బుర్రకథను, 1948లో నాటకమును ముగింపించి "కవివతంస" బిరుదమను గ్రహించి ప్రస్తుతము సర్వస్వ గ్రంధమును వ్రాయించుచున్న జగద్గురు శ్రీవిరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర భగవానులవారికి భక్తితో నీపారాయణ గ్రంథమును సమర్పించుకొనుచున్నాను.

ఇట్లు

1951

గ్రంథకర్త

## బ్రహ్మేంద్ర పారాయణ చరిత్రము.

### తొలిపలుకు

శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి పారాయణ చరిత్రమను నీద్వాత్రింశన్మంజరి (32 పద్యములుగలది) మన్మిత్రులును, భక్తకవి శేఖరులునగు బ్రహ్మశ్రీ ఇంకోల్లు శ్రీరామశర్మగారిచే రచింపబడినది. వీరు భక్తజనులు నిత్యము పారాయణ మొనర్చుట కనువుగా నుండునట్లు శ్రీబ్రహ్మముగారి చరిత్రను సంగ్రహముగా రచించిరి. భక్తులయుపయోగార్థము షోడ శోపచార పూజావిధాన పద్య కుసుమావళినిగూడ నిందుజేర్చి యున్నారు.

శ్రీ వీర బ్రహ్మముగారి చరిత్ర ఆంధ్రమునఁ బద్యకావ్యముగా నింతవరకెవరును రచింపలేదు. నేడీకవివర్యులాలోటును దీర్చినారు. ఇంకను భక్తిమత ప్రచార దీక్షాపరులగు వీరు శ్రీస్వామి చరిత్రమును గేయకావ్యముగాను, హరికథగాను, బుర్రకథగాను, నాటకముగాను రచించియున్నారు.

వీరి కవిత్వము మృదుమధుర పదబంధురమై యర్థపుష్టితో నలరారుచుండును. విపులమగు భావార్థములను సంగ్రహముగా సూటిగా జెప్పుటయందు వీరు మిక్కిలి నేర్పును జూపియున్నారు. వీరి కవితాశైలికి దిఙ్మాత్రముగా నీ క్రింది పద్యములను దిలకింపుడు.

చ॥ జననికిఁ బాపమాంబకుబ్ర । సన్నుతఁదారకమున్ వచించి యా
వెనుకను సాంఖ్యమున్ దెలిపి। పిమ్మటనయ్యమనస్కమున్ గ్రమం
బుననెఱిగించి యంతఁబరి। పూర్ణముతోఁ బరిపూర్తిజేసి తా
జననికిఁ జెప్పి యాజ్ఞగొని। చన్న మహాత్ముఁడుమమ్ముఁ బ్రోచుతన్

ఇట్లే 'తీరువంగొల్పుచేయుటకు' 'జగవెంటుగల్గె' 'చనిబవగాన్పురంబు' లోనగు పద్యముల చూచునది.

ఈ పారాయణ చరిత్రమును భక్తకోటి ప్రతినిత్యము నియతితోఁ బఠించి సఫలీకృత మనోరధులగుదురుగాత! త్వరలో వీరి కృతులన్నియు వెలువడుగాత !!

స్థానికోన్నత పాఠశాల
పొదిలి
10-8-1951

ఇట్లు
పదాల రామమూర్తి,
విద్వాన్ తెలుగుపండితుఁడు,

అభిప్రాయములు

----:-----

ఆంధ్ర కవివతంసులగు ఇంకొల్లు శ్రీరామశర్మ గారు భక్తులరుచి భేదములకు సరిపోవునట్లు రచించిన బ్రహ్మేంద్ర పారాయణ చరిత్రమునందలి కవనము పండిత పామరహృదయంగమమై భక్తిరస ప్రబోధకమై యొప్పారుచుండుటచే వారి నభినందించుచున్నాడను.

13-8-51

జలదంకి కృష్ణస్వామిశర్మ,
వంగవోలు.

------:-------

ఈ పారాయణ గ్రంధమున బ్రహ్మేంద్రసేవాదురంధరులును శ్రీరామ బ్రహ్మనామాంకితులును నగు శ్రీరామశర్మ గారు స్వామి యనుగ్రహమున 'ఆది కథను' వెల్లడించిరి.

బ్రహ్మేంద్ర పారాయణ చరిత్రము.

గద్యకావ్యములు ప్రకటనమగు నీరోజులలో నీపద్య కావ్యము 'పారయంణజేయుటకు, బురాణముజెప్పుటకు దద్గ్రంధములు లేకపోయెనే' యనుకొనువారి కొరతను దీర్చెను.

గంభీరములగు నిందలి పద్యములు స్వామిని దర్శించునపుడు సమారాధన భోజనములపుడు రాత్రివేళ నిద్రించ బోవునపుడు వేకువనిద్రలేచునపుడు బఠింపనుపయుక్తమైనవి.

కావున భక్తవర్య లీగ్రంధమును దప్పకుండకొని దేవుని సన్నిధినుంచకొని పారాయణము జేసికొని బ్రహ్మముగారి కృపకుఁ బాత్రులు కావలయును.

ఇదియే మదభిప్రాయము,
సంతనూతలపాడు

ఇట్లు
బి. వెంకటసుబ్బయ్య పంతులు
17-8-51

-----:-----

I had the great pleasure of going through the "Brahmendra Parayana Charitramu". It is an excellent piece of poetry best fitted for devotional purposes. I am very much thankful to the author of this book-let for having given me the opportunity of expressing my heartfelt feelings towards him. May the devotees of Swami Brahmendra make use of this work.

Yours faithfully,

O. Audiseshaiah,
19-8-51

## కర్తృ విజ్ఞాపనము

భక్తాగ్రేసరులారా !

నేను 1943 సంవత్సరము 108 కళ్యాణములజేయ సంకల్పించినప్పుడా కార్యవిజయమునకై పారాయణముజేయ ప్రయత్నించి తద్గ్రంధ మెచ్చటను లేకునికి నీగ్రంథము రచింపఁ దలంచితిని.

కాని, సిద్దయ్య ఉపదేశమునకు వచ్చినప్పుడు గోవిందమ్మ వెళ్ళిపొమ్మనుట, గోవిందాచార్యాది సోదరులు, "నీవు కులహీనుడవు నీకుపదేశమా"? యని కరవాలములతో బైకిదుముకుట, సిద్దయ్య గురుపుత్రులతో, "దమవంటివారు కులభేదములఁబట్టవచ్చునా? యనుట, బ్రహ్మముగారు సిద్ధనిపై కురుకు కుమారుల "నూరకుండుడీ" యని బ్రతిమలాడుట, ఈశ్వరమ్మ సలహాజెప్పుట లోనగువిషయము లీకథలో నుండుటవలన

మహానీయురాలగు గోవిందమ్మ సిద్దని పొమ్మనునా? అభేదబుద్ధిగల స్వామివారి కుమారులు సిద్దనికువదేశముజేయుట కాదని పైకిదుముకుదురా ? కారణజన్ముడగు సిద్దయ్యగురుపుత్రులతో నీతులు బలుకునా? భగవంతుడగు బ్రహ్మముగారు సామాన్యులవిధమునఁగుమారుల బ్రతిమలాడునా? ఈశ్వరమ్మ సలహాతో బనియున్నదా? యని అనుకొనుచు

నిప్పుడీ చరిత్రనెట్లు జేయవలయును? ఎవ్వరీ సందేహములదీర్చువారని పెక్కురోజు లాలోచించి స్వామివారివలన

గాని ఇట్టిసందేహములు తీరవని నిశ్చయించి 100 రోజులు దీక్షవహిం చి కడకు స్వామివారివలన నానందేహములబాసి గ్రంథముజేసి పారాయణకు బెట్టికొంటివి.

దీని పారాయణ ఫలితముగ నప్పుడా 108 కళ్యాణములేగాక శ్రీవిశ్వకర్మమహాయజ్ఞము తరువాత 125 కాశీలింగముల ప్రతిష్ఠయు, నెరవేరెను. అంతేకాదొకప్పుడు ప్రాణాపాయముకూడం దప్పెను.

ఇట్టి మహిమగల గ్రంథమిది. ఇయ్యదెప్పుడో ప్రకటనము గావలసియుండెనుగాని ద్రవ్యాభావమున నింతవఱకునాగి యిప్పుడు ప్రకటింపబడుచున్నది. దీనిని మీరందరు పఠించి సఫలీకృత మనోరథులు కావలయును.

నిత్య మీగ్రంధము పారాయణముజేయుచున్న శ్రీరామబ్రహ్మ భక్తసమాజమువారికిని, దీనిని పురాణ కాలక్షేపముల జేయుచున్న శ్రీమాన్ పరాంకుశం వేంకట శేషాచార్యులుగారికిని, శ్రీమద్గాత్రం జాలయ్య శాస్త్రిగారికిని, దీనికి దొలిపలుకు వ్రాసియిచ్చిన బ్ర॥ విద్వాన్ పదాల రామమూర్తి కవిగారికిని, అభిప్రాయములిచ్చిన బ్ర॥ జలదంకి కృష్ణస్వామిశర్మగారికిని, బ్ర॥ భద్రిరాజు వేంకటసుబ్బయ్య పంతులుగారికిని, బ్ర॥ ఒంగోలు ఆదిశేష్యయ్య గారికిని పోషక చందా ననుగ్రహించిన బ్ర॥ బండికట్ల వెంకటరత్న శాస్త్రి గారికని మత్కృతజ్ఞత.

వీరి నందరిని బ్రహ్మేంద్రస్వామి రక్షించుగాత.

శ్రీరామబ్రహ్మాశ్రమము
పెదకొత్తపల్లి

ఇట్లు
గ్రంధకర్త

ఈ గ్రంథమచ్చుగాక పూర్వము వినినవారు
నన్నడిగిన ప్రశ్నలు, నేనిచ్చిన జవాబులు.

--------

వినినవారు:- ఏమండీ! ఇందు విష్ణుమూర్తే బ్రహ్మముగారని రాలేదే?

నేను:- ఔను! అదిఖాయమెట్లు? ఒక చోట విష్ణువని యుండెను. మరియొక చోట శివుడని యుండెను, వేరొకచోట బ్రహ్మయని యుండెను.

నేను:- పోలేరమ్మ నిప్పిచ్చుట, బ్రహ్మముగారు చుట్ట త్రాగుట కూడా నిందులేదే?

విని:- పొరులు చందానిమ్మనుచుండ `తాటిచెట్టెందుకెక్కితివంటే దూడమేతక' న్నట్లు నిప్పు దెప్పింది చుట్ట గాల్చిన ప్రయోజనమేనా? అందుకు నుజూచిన, స్వామివారు త్రాగుడు మాన్పువారుగాని త్రాగువారుగారే

విని: సిద్దయ్య బ్రహ్మముకడ కుపదేశమునకు వచ్చినపుడు గోవిందాచార్యాధి సోదరులు`కుహీనుండవగు నీకుపదేశమా? యని పై కురుకుట లేదే?

నేను.- అట్లురుకుటకు వారజ్ఞానులుకారు. వారు లోకోద్ధారకులు. మహానుభావులు, సమరసభావులునగుదురు అట్టివారు కులభేదములంబాటించి సిద్ధుని పై కురుకుదురా? `కులమెంచగా నేల గుణముకారణ' మనినదా వారు బోధించునది.

విని :- ఇం దీశ్వరమ్మగారేది ?

నేను :- ఈశ్వరమ్మగారితో నేమిపని? తాతగారు 153 సంవత్సరము లవారు, తండ్రిగారు 80 సంవత్సరములవారు వీరి కుభయులకు తెలియని వక్షమున 20 సంవత్సరములీడుగల యీమె సలహాచెప్పుటయా?

విని :- సిద్ధయ్య పూలఁగొనివచ్చినప్పుడు గోవి,దమ్మ తలుపులు మూయించినట్లు వినుచున్నామే. ఇందదిలేదేమి?

నేను ఆమె తలుపు లేలమూయించును? పెండ్లిగాక పూర్వము తనకు వరుఁడిక మూడు రోజులకు వచ్చునని చెప్పెను. తండ్రి చూడవచ్చినప్పుడు వంటజేయకయెవేడివేడి పదార్థములతో భోజనము పెట్టెను. అట్టి యామె అజ్ఞానురాలువలెఁదలుపులు మూయించునా?

విని :- సిద్ధయ్య పూలఁదెచ్చి యించుకైన దుఃఖింపలేదేః

నేను:- సిద్ధయ్య నిత్యానిత్యవస్తు వివేకముగలవాడు, గాక తారక సాంఖ్య అమనస్క, పరిపూర్ణము లయ్యగారిదగ్గరఁ జక్కగా గ్రహించిన దిట్ట సిద్ధవటములో నల్లరాతికి నమస్కరించి సహస్రశకలంబులఁజేసిన మేటి. అట్టివాడు "హా! వీరగురూ! నన్నొంటరిగఁజేసి పోతివా? నాకు దిక్కెవరు?" అని ఘోరముగా దుఃంఖిచునా? అగ్నికిఁజలంటునా? పరిపూర్ణునకు దుఃఖముగలదా ?

విని :- మీరిపుడు చెప్పిన జవాబులన్నియు నిజముగానున్నవి. మాకునచ్చినవి, ఇంతవఱకెవరికి గోచరించని యీ విషయములు మీరెట్లు గ్రహించితిరి?

నేను:- నేనిప్పటికి 30 సంవత్సరముల నుండి శ్రీస్వామివారి సేవలోనున్నాను. ఈ పారాయణ చరిత్రజేయునపుడు శ్రీస్వామివారి కృపవలననే గ్రహించినాను.

విని:- అయ్యా! తామిందింక నిట్టిమార్పులేమేమి జేసితిరో వానిని మాకుఁ బూర్తిగ వినిపింపవలయును.

నేను:- నేనిపుడా మార్పులన్నియు నెక్కడజెప్పగలను? వాని నన్నిటిని 'బ్రహ్మేంద్ర సర్వస్వమ'ను గ్రంథమున వ్రాసినాను. కొలది రోజులలో నాగ్రంథము పూర్తియై ప్రకటనము జరుగును. మీకాతలంపు గలదేని అపుడందుఁజూడుఁడు.

విని:- మేమికమీరిపుడు చెప్పిన విషయములను ప్రచారము జేయవచ్చునా ?

నేను :- నిరభ్యంతరము. నిత్యము నేనీ ప్రచారముజేయుచు నేయున్నాను. మీరును నట్టి ప్రచారముజేసి స్వామివారి యశశ్చంద్రికల దశదిశలఁ గావించుడు.

విని:- సరే! చేతనైనంతవరకు జూచెదము, ఇకవచ్చెదము

నేను:- మరువకుడు

జైవిరాట్.

ఓమ్

నమోవిశ్వకర్మణే



కృతిపతి :

శ్రీవీరబ్రహ్మము

గ్రంథకర్త :

శ్రీరామబ్రహ్మము.

శ్రీరామ బ్రహ్మాశ్రమము, పెదకొత్తపల్లి.

శ్రీ

# బ్రహ్మేంద్ర పారాయణ చరిత్రము

## పద్యపూజ

దీపారాధన గావించి సంకల్పము ముగించి పూజకు బ్రారంభింప వలయును. ముందవసర నైవేద్యము జరిపి పూజ పూర్తిజేసి చరిత్ర పారాయణమైన వెనుక మహానైవేద్యమిచ్చి ఉద్వాసనముజెప్పి భోజనము జేయవలయును.

పారాయణము లేకుండ నొక్కపూజను మాత్రమే జరుపుకొనువారు అవసర నైవేద్యమువెంట మహానైవేద్యమును అర్పణమువెంట ఉద్వాసనమును జెప్పి పూర్తిజేసి కొనవలయును. ఈరెండుపచారములు కట్టకడనున్నవి.

పూజలు:- సేవాదర్పణములో గేయపూజ ఏకగేయపూజ మంత్రపూజలును, హరికథ, బుఱ్ఱకథ నాటకములందు నేకపద్యపూజను, ఇందు పద్యపూజను మొత్తము 5 విధములుగ జేసితిని. వీనిలో నెవరి కేదిష్టమో దానిని గావించుకొనవలయును.

### పూజారంభము

### ధ్యానము

తే॥ గీ॥ శ్రీకరుని బ్రహ్మవంశాబ్ధి। శీతకరుని
పరమ గుణుని గోవిందాంబ। ప్రాణవిభుని
విశ్వమయుని విరాడ్రూప। వీరగురుని
జేరి ధ్యానింతు మదభీష్ట। సిద్ధికొరకు

శ్రీ బ్రహ్మేంద్రస్వామి నేనమః ధ్యానం సమర్పయామి.

## ఆవాహనము

తే॥ గీ॥ అబ్జదళ నేత్ర ! వీరపా ! పాంబపుత్ర
సాధుజన పోష! రత్నసం! స్థగిత భూష!
అమల గుణజాల! భక్తలోకానుకూల
నందముగ నిన్ను నా వాహనం బొనర్తు
శ్రీబ్రహ్మేంద్రస్వామినేనమః ఆవాహనం సమర్పయామి

## సింహాసనము

తే॥గీ॥ బ్రంహ్మవంశ కిశోర! నిర్జర వరేణ్య
ప్రాజ్ఞ సన్నుత! ఇన్నవ! రత్నఖచిత
దివ్యసింహాసనంబుపై! తేజమలర
జాయతో గూడ నీవు వేం। చేయుమయ్య
శ్రీబ్రహ్మేంద్ర స్వామినేనమః సింహాసనం సమర్పయామి

## పాద్యము

తే॥గీ॥ భక్తవత్సల! కాలజ్ఞ! పరమపురుష!
కవిజనస్తుత! సుశ్లోక! కలుష! హార!
విశ్వదేశిక! చిద్రూప! వీరదేవ!
పాద్యమును గొనుమిదె సమర్పణముజేతు
శ్రీబ్రహ్మేంద్ర స్వామినేనమః పాద్యం సమర్పయామి

## అర్ఘ్యము

తే॥గీ॥ అభవ। నిర్ద్వం ద్వమూర్తి। వేదాంతవేద్య
నళిననేత్ర మహాత్మ। ప్రాజ్ఞాన పురుష

ఆశ్రితావన! బ్రహ్మేంద్ర! యమితభక్తి
నర్ఘ్యమిడుచుంటి గైకొనుమయ్య దయను
శ్రీ బ్రహ్మేంద్ర స్వామినేనమః అర్ఘ్యం సమర్పయామి

## ఆచమనము

తే॥గీ॥ నిర్వికార! నిరంజన!నిగమ వినుత!
జలజనేత్ర! కృపాంబోధి! స్వర్ణచేల
సిద్ధనుత వీరగురునాథ! శుద్ధజలము
లాచమింపుమి దేవజోహారు నీకు
శ్రీ బ్రహ్మేంద్ర స్వామినేనమః ఆచమనీయం సమర్పయామి

## మధుపర్కము

తే॥గీ॥ ఆది మతధామ! సకలలో! కాభిరామ!
సద్గుణస్తోమ! విబుధ సం!చయ లలామ
బ్రహ్మవంశాబ్దిసోమ! వీ!ర గురునామ
ప్రేమనిదె మధుపర్క మ!ర్పింపుచుంటి
శ్రీబ్రహ్మేంద్ర స్వామినేనమః మధుపర్కం సమర్పయామి

## స్నానము

తే॥గీ॥ క్రమముగా దివ్య పంచామృతములతోడ
విమల పుణ్యస్రవంతీ జ!లములతోడ
బంచసూక్తోక్తయుగ భక్త!వర్గ వినుత
స్నానమును జేయుమయ్య! యీ!క్షణమునందు
శ్రీబ్రహ్మేంద్రస్వామి నేనమః స్నానం సమర్పయామి

## వస్త్రము

తే॥గీ॥ పరమపావన! సర్వజ్ఞ! పద్మనయన!
సత్యభాషణ! మహితాత్మ! సాధుతరణ!
భువన మోహన! బ్రహ్మేంద్ర! భూతసదన!
కనక పరిధానము లివె గైకొనుము నీవు
శ్రీబ్రహ్మేంద్ర స్వామినేనమః వస్త్రం సమర్పయామి

## యజ్ఞోపవీతము

తే॥గీ॥ వరదబ్రహ్మాండ నాయక! వంశదీప
జ్ఞాన సంపన్న! పరమేశ! దీనరక్ష
శాంతగుణభూష! బ్రహ్మేంద్ర! సమ్మదమున
బ్రహ్మసూత్రము గొనుమిదే! ప్రస్తుతింతు
శ్రీబ్రహ్మేంద్రస్వామి నేనమః యజ్ఞోపవీతం సమర్పయామి

## గంధము

తే॥గీ॥ రమ్యచరిత! శుభాంగ! గీర్వాణ వినుత
అబ్జనయన! మనోజ్ఞ! వేదాంత భవన
భక్తలోల! సుశీల! ప్రపంచమూల!
గంధమిచ్చితి దయతోడ నందికొమ్ము
శ్రీబ్రహ్మేంద్ర స్వామి నేనమః గంధం సమర్పయామి

## అక్షతలు

తే॥గీ॥ మధురబాషా సమన్విత! మంగళాంగ!
యజ్ఞపూరుష! బనగాన్పు! రాధినాధ!

బ్రహ్మేంద్ర పారాయణ చరిత్రము.

ధర్మరక్ష! కృపాపాంగ! దాసవినుత!
అనఘ! బ్రహ్మేంద్ర! ఇవె గొనుమక్షతలను
శ్రీబ్రహ్మేంద్రస్వామి నేనమః అక్షతాం సమర్పయామి

## పుష్పము

తే॥గీ॥ వినయమున అచ్చమాంబ సేవించినట్టి
క్షితివిభులు పెక్కుమంది యర్చించినట్టి
వీరదేవ! నీ చరణారవిందములకు
పూజ సేయుచునుంటి నింపు మెయిగొనుము
శ్రీబ్రహ్మేంద్ర స్వామినేనమః పుష్పము సమర్పయామి

## ధూపము

తే॥గీ॥ సర్వతోముఖ! పరిపూర్ణ! సాధురక్ష!
పాపహరణ! మహాభాగ! తాపసనుతః
దేవ! గురుదేవ! శ్రీవీరదేవ! గొనుము
ప్రేమతోడుత ధూప మర్పించు చుంటి.
శ్రీబ్రహ్మేంద్ర స్వామినేనమః ధూపం సమర్పయామి

## దీపము

తే॥గీ॥ తార మణిహార! కీర్తివిస్తార! మేరు
ధీర! భవదూర! వార్ధి గంభీర నీకు
భక్తి సంభరితముగ దీపంబునర్ప
ణంబొనర్చితి గొనుము మోదంబు తోడ
శ్రీబ్రహ్మేంద్రస్వామి నేనమః దీపం సమర్పయామి

## అవసర నైవేద్యము

తే॥గీ॥ పచ్చికొబ్బెర, నారింజ। పండ్లు గుడము
కదళికాఫలములు జామ। కాయ లింక
పానకము వడపప్పు నో ప్రభు।మతేశ!
ఇంపు మీరంగ నీ వార।గింపు మిపుడు,

శ్రీబ్రహ్మేంద్రస్వామినేనమః అవసరనైవేద్యం సమర్పయామి

## తాంబూలము

తే॥గీ॥ శౌర్య గుణధుర్య! వీర యా।చార్య వర్య!
మేరు సన్నిభ ధైర్య! య।మేయ వీర్య!
పరమళ ద్రవ్యభరితమై। పరగు నన్మ
దీయ తాంబూల మిదిగొ యం।ది కొనుమీవు

శ్రీబ్రహ్మేంద్ర స్వామినేనమః తాంబూలం సమర్పయామి

## నీరాజనము

తే॥గీ॥ ఆది మధ్యాంత రహితమై। యలరునట్టి
సర్వశక్తులు గల్గి తే।జరిలు నట్టి
కంది మల్లయ్య పురిలోన! గ్రాలునట్టి
జేజె నాయన! గొనుము నీ।రాజనంబు

శ్రీబ్రహ్మేంద్ర స్వామి నేనమః నీరాజనం సమర్పయామి

## మంత్రపుష్పము

తే॥గీ॥ దీనమందార! విబుధ వం।దిత సుధీర
సత్వ గుణదీప! రవిసహ।స్ర ప్రతాప!

వీర గురుదేవ! వార్ధిగంభీర భావ!
సంగ్రహింపుమ మంత్రపుష్పంబు నీవు
శ్రీబ్రహ్మేంద్ర స్వామినేనమః మంత్రపుష్పం సమర్పయామి

## నమస్కారము

తే॥గీ॥ అచ్చమాంబా శరణ్య దేవాగ్ర గణ్య!
భూతగణ మాన్య! బ్రహ్మేంద్ర! బుధవరేణ్య
భక్తినీకు బ్రదక్షిణ యుక్తముగని
దే నమస్కారమును జేసి తిని గ్రహించు
శ్రీబ్రహ్మేంద్రస్వామి నేనమః నమస్కారాన్ సమర్పయామి

## పునఃపూజ

తే॥గీ॥ స్వామి! గోవింద మాంబికా ప్రాణనాథ!
పూర్తిజేయ పునః పూజఁబూనినాడ
నిందు సర్వోపచారంబు లింపుగగొని
డెందమందున నానంద మొందుమయ్య!
శ్రీబ్రహ్మేంద్ర స్వామినేనమః పునఃపూజాం సమర్పయామి

## క్షమాపణము

తే॥గీ॥ దేవ! మఠనాథ! నేజేయు సేవయందు
దప్పులెన్నిన్ని యున్నవో చెప్పలేను
గాన వాని క్షమించి చక్కంగ నన్ను
గావుము కృపా కటాక్ష వీక్షణముతోడ
శ్రీబ్రహ్మేంద్రస్వామి నేనమః క్షమాపణ వేడుకొనవలెను.

అర్పణము

అన యాధ్యానావాహనాది షోడశోపచార పూజ
యాచ భగవత్సర్వాత్మకః శ్రీమద్గోవిందా భగవితీసమే
త బ్రహ్మేంద్ర దేవ సుప్రీత సుప్రసన్నో వరదో భవతు॥
సర్వం శ్రీబ్రహ్మేంద్రార్పణమస్తు.
పూజ సంపూర్ణము.

--------

# పూజ జేయువారికి సూచన

అర్చించునది పటమగునేని

పాద్యమునకు, అర్ఘ్యమునకు, ఆచమనీయమునకు, స్వామికి నీటినిజూపి పళ్లెములో వదలవలయును.

పంచామృత స్నానమునకును

పంచామృతములజూపి పళ్లెమున వదలవలెను,పంచామృతములనగా పాలు, పెరుగ, నెయ్యి, తేనె, చక్కెర.

శుద్ధోదకస్నానమునకు నీటినిజూపి పళ్లెమునవదలవలెను.

వస్త్రములేనప్పుడు వస్త్రార్థం అక్షతాన్ సమర్పయామి అని యజ్ఞోపవీతము లేనప్పుడు యజ్ఞోపవీతార్థం అక్షతాన్ సమర్పయామి అని అక్షతలు వేయవలయును.

పూజ పుష్పములతో చేయవలెను

ధూపము వేయునప్పుడు దీపము జూపునప్పుడు నైవేద్యము బెట్టునప్పుడు గంట వాయింపవలయును.

కర్పూర నీరాజనమిచ్చుచు గంటవాయింపవలయును

అర్పణకు నీటిని పళ్లెములో వదలవలయును.

ఓమ్

శ్రీబ్రహ్మేంద్ర స్వామినేనమః

శ్రీరామ

# బ్రహ్మేంద్ర పారాయణ చరిత్రము

ప్రారంభము

ఉ॥ శ్రీకరుఁడవ్విరాట్టు నిజ। సేవక సంస్తుతు లాలకించి, య
స్తోక కృపాంతరంగుడయి। తోడనెవారలబ్రోవనెంచి, భూ
లోకముజేరుమాయని త। లోదరితోడను హెచ్చరించి, ర
మ్యాకృతియౌనిసుంగుసక। లార్థము లెప్పుడు మాకొసంగుతన్

ఉ॥ ఆ యరుదైన బిడ్డని సు। మాళికి బోయి సరస్వతీ తట
స్థాయత శాఖి క్రిందఁగని। హర్షముతోఁ గొనితెచ్చి వీరనా
రాయణ నామధేయ మిడి। రాగముమీరగ బెంచునత్రికిన్
బాయని మోదమున్ గొలుపు। బాలకుడేలుతమమ్ము నెప్పుడున్

చ॥ తనయులుపుట్టకున్కిఁబలు। ధర్మములన్ బెనుకాంక్షజేసియా
వెనుకను బుణ్యభూములకు। వెళ్లుచు నత్రిని జేరఁనాత డీ
యనుపమబాలునియ్యఁ గొని। యర్మిలిసాకెడుభోజదంపతుల్
మనములఁబొంగఁ గ్రీడలవె। లార్చెడుకుఱ్ఱఁడుమమ్ముబ్రోచుతన్

చ॥ జననికిఁబాపమాంమకుఁ బ్ర। సన్నతఁ దారకమున్ వచించి యా
వెనుకనుసాంఖ్యమున్ దెలిపి। పిమ్మటనయ్యమనస్కమున్ గ్రమం
బున నెఱిగించియంత బరి। పూర్ణముతోఁ బరిపూర్తిచేసి తా
జననికిఁ జెప్పియాజ్ఞగొని। చన్న మహాత్ముఁడుమమ్ముబ్రోచుతన్

ఉ॥ విశ్వహితార్థ ధర్మముల। వేలముగా నెలకొల్పుకొంచు రా
మేశ్వరమేగి యందు భజి। యించెడి భక్తులకెల్లసంత తా
నశ్వర మైన మోక్షమిడి। యావల వెన్కకుఁ బైనమైన వీ
రేశ్వరుఁడిచ్చుగాత!మద। భీష్టము లెప్పుడుసత్కృపా మతిన్

చ॥ వెఱవక ద్వీపిపై శరము। వేయఁ దదాహతి గోవుగూలదు
ర్భరమగు నయ్యఘంబెటుల। బాయునటం చును బైరవుండురా
హరిహర పట్టణంబునను। బ్రార్థన సేయఁ దురుష్కజాతిని
ర్ధరజనియింపు మంచనెడు। దైవము వీరగురున్ భజించెదన్

చ॥ కరమను రక్తినంత బన। గాన్పురి నచ్చమ యొద్దకేగియా
గరితకుఁ గల్లు గోవులను। గాయుచు బ్రక్కనగంబు పైశుభం
కరమగుకాలతత్వమను। కావ్యమువ్రాసెడివేళనామెరాన్
గరుణను మంత్రమున్బలుకు। గణ్యుఁడుమామఠధాముడేలుతన్

చ॥ రాజితపుణ్యభూములఁ బు। రంబులఁ గాంచుచువిప్రవర్యుఁడ
న్నాజయవచ్చి కావ్యరచ। నంబొనరించు టెఱింగియో జగ
ద్భిజ! తదీయ సారమును। దెల్పు మనంగనె కాలతత్వమ
వ్యాజకృపామతిన్ బలుకు। బ్రహ్మముమమ్మనయంబు బ్రోవుతన్

ఉ॥ పొందుగ భద్రకాళి విభు। పొంతను భక్తుల నేలుచుండి పే
రందిన కందిమల్లయ స। మాఖ్య పురంబున వచ్చినిల్చి తా
నందు ననేకరీతుల మ। హత్వముజూపుచు నాదిశక్తిగో
విందమఁ బెండ్లియాడినక। విస్తుతు మామఠనాథుఁగొల్చెదన్

ఉ॥తీరువఁగొల్పుసేయుటకు। దెమ్మని పౌరులు పట్టుబట్టనే
తీరుననిత్తుఁ బేదనని। తెల్పుచునయ్యెడ నిల్పియున్న ఫా
లేరిని బైటికిన్ బిలిచి। లేదిపుడింటను నీనొసంగు మీ
తీరువ నీకు నిత్తునను। దేవుఁడు వీరగురుండు బ్రోచుతన్

చ॥ఉరగము కాటువేయ మృతి। నొందిన కుఱ్ఱని గాటికార్తినిన్
బొరయుచు బంధురాజిగొని। పోవుట ద్రోవనుజూచినిల్పిక్ర
మ్మర బ్రతికించి తన్మృతుని। మాదవరంబున వాని తల్లిచేఁ
బరగబహూకృతుల్వడయు। బ్రహ్మముమాకుఁజిరాయువిచ్చుతన్

ఉ॥నందను లేవురున్ మఱియు। నందనయొక్క తెపుట్టఁ బెద్దకొ
డ్కుం దనమామపెంపకము। గోరిననిచ్చియుఁ దక్కువారి కా
నందముతో వివాహములొ। నర్చి శ్రితావళిగాచుచున్న గో
విందమ ప్రాణవల్లభుఁడభీష్టము లిచ్చుత! మాకునెప్పుడున్

చ॥పదుగురు మంచి వాడనెడి। భక్తుఁడు సిద్దఁడురాఁగ వానినిన్
సదయతఁగాంచి ప్రాథమిక। సాధన సంపద శిష్యచర్యలన్
మొదలగువానిఁ దెల్పుటకుఁ। బుత్రుల కాజ్ఞనొసంగి జ్ఞానమా
పిదప వచించునట్టి ఘన। వీరగురున్ స్మరణం బొనర్చెదన్

చ॥తనయుఁడు సిద్దడేగుటనుఁ। దండ్రి దిగుల్ పడిరాగ వానికిన్
మనసు గుదిర్చి పంపి కరుణారస దృష్టినిఁ దారకంబుసి
ద్దని కెఱిగించి తండ్రికిము। దం బొనగూడఁగఁ బెండ్లియాడియి
చ్చనునిటువచ్చుచుండుమను।స్వామి మఠాధిపుఁ డేలుతన్ మమున్

ఉ॥చాలగబ్రహ్మవిద్యనుప్ర। చారముజేయుచు నూళ్లయందుఁగ
ర్వాలు నవాముగోరగ ని।రూఢిగ నాతని యశ్వపిండపున్
బోలికఁజెప్పి చూపి మఱి। పూర్వపురీతిని వాజిఁదెచ్చి పే
రోలగమందు నిల్పిన గు।రూత్తముఁ డామఠదేవుడోముతన్

ఉ॥అచ్చటనుండి పుష్పగిరి। కాగమమున్ బఠనంబు సేయుచున్
వచ్చుచునుండ విప్రులు వి। వాద మొనర్చుచునడ్డురాఁ బురిన్
గ్రచ్చరమండజేసి గత।గర్వులు వారలు మ్రొక్క నార్పితాఁ
జెచ్చెర నిల్లుసేరు గురు। శేఖరు నచ్చమవంద్యుగొల్చెదన్

ఉ॥చక్కగ సిద్ధయాఖ్యునకు। షట్కమలంబులఁ గూర్చి చెప్పుటన్
గక్కయచాటునుండి విని। కాంచనిజంబును నాలిఁగోసియే
ప్రక్కను నేమిగానకటు। భార్యగతించుట వచ్చియేడ్వఁ బె
న్మక్కువ నామె ప్రాణమిడు। మామఠనాథుఁ బ్రశంసజేసెదన్

ఉ॥సిద్ధవటాధి నాయకుఁడు। సిద్ధడు జాతికి మ్రొక్కి తచ్ఛిలన్
బద్ధలుసేయుటన్ గనియు। బాపురె వీనిగురుండి కెట్టిడో
ఖుద్దునఁ జూత మంచపుడు। గొబ్బున బిల్వగబంప శిష్యులన్
దద్దయు గూడిపోవు మఠ। దైవము నెప్పుడు నాశ్రయించెదన్

చ॥జగమెటుగల్గె? నున్నెమరు। జన్మము? మోక్షమనంగ నేమి?ము
న్నగు పలుప్రశ్నలెల్ల యవ। నాధిపుఁడడ్గి సదుత్తరంబులి
య్యగవినిమర్త్యులొ క్కటియ?యందుకుభిన్నమ?యన్నొక్కటే
యగునను వీరభోజసుతుఁ।డభ్యుదయంబుల మాకొసంగుతన్

చ॥ ఇలనరులొక్కటేని విబు। ధేశ్వర! మాగృహమందునన్నమిం
పలరభుజింపు మంచన ధరాధిప! యామిషభుక్కులైన మీ
నిలయమున న్భుజింపగన। నెంతువ శక్తిని జేర్చుమన్న మం
చలరులబండ్ల జేయుమహి। మాధ్యుఁజిదంబరవంద్యుగొల్చెదన్

చ॥ అరుగుచునుత్తరంబునకు। హైదరబాదు పురంబుఁజేరి త
త్పురవిభుఁడౌ నబాబునకు। బోధనొనర్చుచు నా నృపాల శే
ఖరుడుఁదకంబు దెచ్చిన న। ఖండపు జ్యోతినివెల్గజేసి చూ
వరులకువింతఁగొల్పు భగ। వంతుఁడు బ్రహ్మము మమ్ముబ్రోవుతన్

ఉ॥ అంతట జ్ఞానబోధను బ్ర। జాళికిఁ జేయుచు నాహిమాద్రి ప
ర్యంతమునేగి దక్షిణ ది। శాభిముఖుండయి పర్యటించుచున్
వింతగ దుష్టులన్ సుజన। బృందముఁ జేసియు జగ్గరాజు మేల్
సంతతిఁ బొందగా వరమొ। సంగిన పాపమపుత్రుఁగొల్చెదన్

చ॥ ఖలుల మనంబుద్రిప్పి యను। కంపను వారల నెల్లసాధు వ
ర్యులుగ నొనర్చి భక్తజను। లొందెడు బాధలఁదీర్చినాడ నే
నలుపదలంచు కార్యముల। నల్పితి నింక సమాధియౌదు నం
చలరెడి జేజెనాయన! ప్రియంబున మమ్ము సముద్ధరించుతన్

చ॥ ముద మొదవన్ సభా స్థలిని। పుత్రులు భృత్యులు గొల్చుచుండగ
య్యదనున నే నొనర్చుపను। లన్నియుబూర్తి నయ్యెగాన రే
పుదశమి భానువారమున। భూమినివీడి సమాధినిష్ఠ బొం
దెదనను స్వామి వీరగురు। దేవుఁడు మాకిడు సర్వసౌఖ్యముల్

చ॥ చని బనగాన్పురంబునకు। జయ్యనఁ బువ్వులఁ దెమ్మటంచు సి
ద్ధని బ్రియశిష్యునిన్ బనిచి। దారిని పెన్జడిగూర్చి వ్యాఘ్రక
ల్పనమొనరించి కాపువలె। వచ్చియు మీద నిజస్వరూప ద
ర్శనమిడితానదృశ్యమగు। బ్రహ్మమునున్ భజియింతు నెమ్మదిన్

చ॥ ఎదుటన నేకవాద్యములు। నింపుగఁ జేయుచునుండ భక్తిసం
పదగలవారు మ్రొక్కులిడఁ।బౌరులుగొల్వమహోత్సవంబుతో
నుదయమెలేచి యమ్మఠము।నొద్దకు జీవసమాధినంద స
మ్ముదమున జేరు వీరగురు।మూర్తినిగూర్చి నమస్కరించెదన్

చ॥ తనరగ నింటివారలకు।ధర్మము లెన్నొవచించి లోక పా
వనుడని తన్ను జూచుటకు। వచ్చుప్రజావళికిన్ గృపార్ద్ర దృ
ష్టిని హితబోధఁజేసి బుధ। శేఖరులెల్ల నుతింపగా సమా
ధిని గను వీరదేశికుని। దివ్యపదంబుల గొల్తునెప్పుడున్

చ॥ త్వరగతిఁబోయి పుష్పసము।దాయముదెచ్చియు నీయనుజ్ఞనే
విరులను దెచ్చినాడ నిటు। వెల్పలికిన్ జనుదెమ్ము వీర స
ద్గురువర! పూజజేతునని। కోరిక సిద్ధుఁడు వేడ న త్తరిన్
గరుణను బైకివచ్చుబన।గాన్పురవాసుఁడు మమ్ముబ్రోవుతన్

చ॥ వెనుకను భైరవాఖ్య పృధి।వీపతి పీవని పూర్వజన్మ గా
ధనువచియించి కన్నులఁజె। దర్పగజేయు విరాట్స్వరూప ద
ర్శనమునొసంగి సిద్ధనికి। సత్కృపఁ బావలు చేతిబెత్తమి
చ్చిన మఠనాయకున్ వినుతి। జేసెద భక్తిపురస్సరంబుగన్

బ్రహ్మేంద్ర పారాయణ చరిత్రము.

ఉ॥ఈమహిఁగ్రొత్తపల్లిపురి నింకొలు వంశభవుండ నైన శ్రీ
రామకవీశ్వరున్ నను నిరంతర భక్తిమత ప్రచార దీ
క్షామతిగానొనర్చి యిటు సంగ్రహరీతిగ నీ చరిత్ర నా
చే ముగియింపఁజేసిన విశిష్టగుణున్ మఠనాథు గొల్చెదన్

ఉ॥మంగళమయ్యనీకు నృ పమాన్య! చిదంబర భక్తరక్షకా
మంగళమయ్య! నీకు గుణ మండన! శ్రీబనగాన్పురాధిపా!
మంగళమయ్య! నీకు నిగమస్తుత! సిద్ధమనోరథ ప్రదా!
మంగళమయ్య! నీకు శ్రితమంగళదాయక! వీర దేశికా!

ఉ॥వీర జనార్ధమండనగ వెల్గెడు నీ భగవచ్చరిత్ర మే
రేరుప్రియంబు మీఅబరియింత్రా లిఖింతురో లేకవిందురో
వారికి నాపరాత్పరుఁడ వారిగ శాశ్వత భోగభాగ్యముల్
కోరిన కోర్కులెల్ల నొనగూర్చును సత్యము సత్యమిద్ధరన్

శ్రీబ్రహ్మేంద్ర పారాయణ చరిత్రము

సంపూర్ణము

## సీసమాలిక

శ్రీ విరాట్ప్రతి నిజా। శ్రితకోటి నుతులొంది
చక్కని శిశురూపు। సరగ దాల్చి
అత్రి భక్తుని నాల। యమున గొన్నాళ్ళుండి
వెనుక నంది గ్రామ। మునకు వచ్చి
అటనుండి రామేశ్వ। రాది భూముల కేఁగి
హరిహర పురమున। నధివసించి
భైరవుఁ దురకింట। ప్రభవింప శాసించి
పైన బన్గానపల్లె। లోనజొచ్చి
గరిమి రెడ్డచ్చమ్మ। గారి గోవుల గాచి
అన్నాజి రాయుని। నచటె నిల్పి
అల్లాడు పల్లెభ। క్తాళిని రక్షించి
కంది మల్లయ పురం । బందుజేరి
గోవింద మాంబను। కొమరొప్పఁ బెండ్లాడి
వెలికి పోలేరి రా। వింప జేసి
ఫణిదష్టుడగు కాపు। బాలుని బ్రతికించి
పుత్రు లేవుర నొక్క। పుత్రి గాంచి
వారి వావాహముల్। వరుసగా గావించి
దా సోఘమునకు ద। త్వము వచించి
సిద్ధయ్యకు గుమాళ్ళ। చే బోధ జేయించి
తక్కిన దంతయు । దానె దెల్పి
పీరు సాయిబు మనో। వికలత బోగొట్టి
కర్నూలు ప్రభువు స। త్కార మంది

ఘన పుష్పగిరి విప్రు। లను దయామతిజూచి
కక్కయ్య సతిని శ్రీ।ఘ్రముగ మన్పి
సిద్ధవటాధీశు। జిత్తంబు మెప్పించి
హైదరబాదు రా। జాత్మ దనిపి
కాశిలో నగుచోట్ల। గల సాధువుల నేలి
అంత దక్షిణదేశ । మరుగు దెంచి
దుష్టాత్ముల మంచి। త్రోవకు రప్పించి
జగ్గ రాజగ్గింప। సంతు నిచ్చి
దీనుల కష్టముల్। దీర్చితినని యెంచి
నిష్క్రమింతు నికంచు। నిశ్చయించి
చాటు కేగెడునట్టి। సమయంబు సూచించి
సిద్దని బూలకు। జెప్పి పంపి
ఇంటివారికి హితం। బింపుమీరగ బల్కి
మఠ గర్భమందు స। మాధి జెంది

తే॥గీ॥ సిద్దనికి నాది రూపంబు। చెలగి చూపి
పాలనము జేయ పెదకొత్త।పల్లి వచ్చి
రాతి విగ్రహమై మనో।రమణి గూడి
వరలు బ్రహ్మేంద్ర మామక। వాంఛలిడుమ

---------

## మహానైవేద్యము

తే॥గీ॥ అన్న పాయస సూప శాకాజ్యములను
పచ్చడుల దప్పళంబును భక్ష్యములను
దధిని నూరగాయల మఠాధామ! ఇవె స
మర్పణము జేసితి భుజింపు మయ్య! నీవు

శ్రీబ్రహ్మేంద్ర స్వామినేనమః మహానైవేద్యం సమర్పయామి

## ఉద్వాసనము

తే॥గీ॥ అఖిల లోకాధినాథ! దయాసనాథ!
సురభి గణపాల! విమలయశోవిశాల!
వీర గురుదేవ ధర్మ ప్రచార భావ!
నీవు దార సహితముగానిష్క్రమింపు.

శ్రీబ్రహ్మేంద్ర స్వామినేనమః యధాస్థానం ప్రవేశయామి

శ్రీమద్గోవిందాంబికా రమణ బ్రహ్మేంద్రోహరిః

## విజ్ఞప్తి.

సోదరులారా!

మీరీగ్రంథము తప్పక కొని దేవతార్చనలో నుంచుకొని పారాయణజేసి కొని సంకల్పసిద్ధిబొందుడు. మీబంధు మిత్రులచేగూడ బఠింపజేసి వారివారి కార్యములను గట్టుకెక్కింపుడు.

ఇట్లు

పెదకొత్తపల్లి శ్రీ.బ్ర భక్తసమాజము

## మా బ్రహ్మేంద్ర గ్రంథములు

1. బ్రహ్మేంద్ర సేవా దర్పణము
2. బ్రహ్మేంద్ర పారాయణ చరిత్రము
3. బ్రహ్మేంద్ర గేయ చరిత్రము
4. బ్రహ్మేంద్ర చరిత్రము హరికథ
5. బ్రహ్మేంద్ర చరిత్రము బుఱ్ఱకథ
6. బ్రహ్మేంద్ర నాటకము
7. బ్రహ్మేంద్ర భక్తామృతము (పద్య కావ్యము)
8. బ్రహ్మేంద్ర సర్వస్వము

ఇట్లు
శ్రీరామ బ్రహ్మాశ్రమము
పెదకొత్తపల్లి - 523 211
మద్దిపాడు మండలము :: ప్రకాశం జిల్లా. ఎ.పి.